*(Approved by the Text Book Committee Madras)*
*V.F.G.G. Dated 16-11-1926.*

# బాలనీతికథలు

## మొదటి భాగము.

BY

A. L. NARAYANA.

PUBLISHERS:
**SITA RAM & CO.,**
**TENALI.**

1931

 *Price. 0-2-0.*

# బాలనీతికథలు.

## మొదటి భాగము.

Author:

**A. L. NARAYANA.**

---

*Publishers:*


**SITA RAM & Co.,**

**Educational Publishers etc.,**

**TENALI.**

---

ఆంధ్ర ముద్రాక్షరశాల, తెనాలి.

---




*[Price 0-3-0*

# విషయసూచిక

# బాలనీతికథలు

## 1 దానముచేసినవాఁడే పుణ్యాత్ముఁడు.

పూర్వకాలమున రంతిదేవుఁడను ఒక రాజుకలఁడు. అతఁడెప్పుడు సత్యము తప్పనివాఁడు, బీదలకును, ఆశ్రయించినవారికిని గోరినదెల్ల నిచ్చుచుండువాఁడు. అట్టి ధర్మాత్ముఁడు లేడని గొప్పకీర్తి బొందెను. కొన్నాళ్ళకాతఁడు రాజ్యము నిడిచి తపస్సు జేసికొనుటకు అడవికి పోయెను. అడవియందుండఁగా ఒకసమయమున నాతనికి ఎక్కడను అన్నము దొరకలేదు. తుదకు సమీపముననున్న ఒక పల్లెకుబోయి కొంచె మన్నము దెచ్చుకొని తినఁబోవుచుండెను. అంతకు మున్న ఆతఁ డన్నముదిని పదిరోజులయ్యెను. ఆ సమయమున నొక బ్రాహ్మణుఁడువచ్చి యన్నము బెట్టుమని రాజు నడిగెను. రంతిదేవుఁడు తాను తెచ్చుకొన్న దానిలో సగము బ్రాహ్మణునకుఁ బెట్టి మిగిలినది తినబోవుచుండెను. అప్పుడొక శూద్రుఁడు వచ్చెను. ఉన్నదానిలో సగము వానికిచ్చి మిగిలినది తినబోవుచుండఁగా నొక కుక్కవచ్చెను. అంతట నతఁడు ఉన్న కొంచెమన్న మా కుక్కకుఁ బెట్టివేసెను. ఇక నతనియొద్ద ద్రాగుటకునీళ్ళుమాత్రమున్నవి. వానినైనను ద్రావి ఆకలిఁదీర్చుకొందమని తలంచుచుండఁగా నొక చండా

లుఁడు వచ్చి దాహామగుచుండెనని పలికెను. రంతిదేవుఁడు సంతోషించుచు దనయొద్దనున్న జలముచే వాని దాహాము దీర్చి పంపెను. అప్పుడు రాజుగుణమునకు మెచ్చి శ్రీహరి ప్రత్యక్షమై "రంతిదేవా! నీగుణములను బరీక్షించుటకు నేనే యిన్ని రూపములతో వచ్చితిని. నిన్ను మెచ్చితిని" అని పలికి యాతనికి మోక్షము నిచ్చెను.

"ఆ. అన్నిదానములను అన్నదానమె గొప్ప
కన్నతల్లికంటె ఘనము లేదు
ఎన్న గురునికన్న నెక్కుడువలేదయా
విశ్వదాభిరామ వినరవేమ."

---

## 2. పలువురతో పగకూడదు.

పాండవులలో అర్జునునకు అభిమన్యుడని నొకకొడుకు కలఁడు. అతఁడు చిన్నతనమునుండియు మహా పరాక్రమవంతుఁడై యుండెను. ఎంతటి వీరునైనను అతఁడు లక్ష్యపెట్టక యుండెను. పాండవులకును గౌరవవులకు జరిగిన యుద్ధములో గౌరవులపక్షముననున్న ద్రోణాచార్యులు ధర్మరాజును పట్టితెచ్చెదనని కౌరవరాజుతోఁ జెప్పెను. ఆమాటవిని ధర్మరాజు భయమంది యింటిలోఁ గూర్చుండెను. కృష్ణార్జునులు దగ్గరలేరు. భీమ నకుల సహదేవులు పరాక్రమవంతులయినను ఆనాఁడు ద్రోణుఁడుపన్నిన వ్యూహమును భేదింపలేరు. దానికి

అభిమన్యుఁడొక్కఁడే సమర్థుఁడు. అందుచేత ధర్మరాజు అభిమన్యుని బిలిపించి “నేడు నన్ను ద్రోణుని చేతిలోఁ బడకుండ రక్షింపు”మని దీనుఁడై యడిగెను. అభిమన్యుఁడు మిగుల సాహసము గలవాఁడగుటచేఁ బెదతండ్రిని భయపడవలదని చెప్పి ద్రోణునిమీఁదకు యుద్ధమునకుఁ బోయెను. కౌరవులలోఁగూడ గొప్పవీరులున్నారు. వారు సామాన్యులుకారు. అయినను అభిమన్యుడు వారిని లెక్కసేయక యొక్కొక్కని నోడించెను. పిల్లవాఁడైన వాని శౌర్యమునకును ధైర్యమునకును వెఱచి కౌరవులు పరుగెత్తసాగిరి. వాని యెదుట నిలిచి యుద్ధముచేయుట కెవ్వరును సాహసింపలేకపోయిరి. అప్పుడు కౌరవవీరులందరును నేకమై యభిమన్యుని బట్టుకొనిరి. ఒకడు గుఱ్ఱములను జంపెను. ఒకడు సారథిని గ్రిందఁ బడవేసెను. మఱియొకఁడు రథము విఱుగగొట్టెను. ఇంకొకడు వాని చేతిలోనున్న ఘాయుధమును దీసికొనెను. ఇట్లందరును నేకమై తుదకు ఆ యభిమన్యుఁ జంపిరి.

“క. బలవంతుఁడ నాకేమని
పలువురతో నిగ్రహించి । పలుకుట మేలా
బలవంతమైన సర్పము
చలిచీమలచేతఁజిక్కి । చావదె సుమతీ.”

# 3. పట్టుదలతో చేసినపని తప్పక ఫలించును.

—[०]—

దేవతలును రాక్షసులును అక్కచెల్లెండ్ర కొడుకులై యుండిరి. కాని వీరిలో వీరికి పొత్తులేదు. ఎప్పుడును ఒకరితో నొకరు యుద్ధములు సేయుచు సాధింపజూచుచుందురు. అది యట్లుండ రాక్షసులయొద్ద గొప్పమహిమగల యాచార్యుం డొకడుండెను. ఆతనిపేరు శుక్రాచార్యులు. అతనియొద్ద మృత సంజీవని యనుపేరుగలవిద్యయొకటియున్నది. దానిమహిమచే నతఁడు యుద్ధములోఁజచ్చిన రాక్షసులను బ్రతికించుచుండెను. దేవతలలో నిట్టిదిలేదు. అందుచేతవారువిష్ణుమూర్తి సన్నిధికి బోయి రాక్షసులు తమ్ముఁబెట్టుబాధలనుజెప్పి రక్షింపుమని వేడిరి. అప్పుడు విష్ణుమూర్తి వారితో మందరపర్వతమును కవ్వముగను వాసుకిని త్రాడుగఁజేసి తఱచినచో నమృతము పుట్టును. ఆయమృతమును త్రావినచో మీరు చిరజీవులగు దురు" అని చెప్పెను.

అంతట నమరులు నెమ్మదిగా రాక్షసులతో స్నేహము జేసికొని యమృతమును గూర్చి వారికి జెప్పిరి. వారును పర్వతమును మోసికొనిపోయి పాలసముద్రములోఁ బడవేసి శ్రీహరిచెప్పినట్లుచేసిరి. మధ్యమధ్య ననేకకష్టములు కలిగెను

ఎన్నికష్టములు కలుగుచుండినను దేవతలు పట్టుదలను వదలక పనిచేసిరి. తుదకు తఱువగా దఱువగా అమృతము లభించినది. ఈయమృతము భాగించుకొనువిషయములో దేవతలును రాక్షసులును కొంచెము కలహము మొదలుపెట్టిరి. ఎట్లయినను ఆయమృతము రాక్షసులకు లేకుండఁ జేయవలయునని తలఁచి విష్ణుమూర్తి ఒకచక్కని స్త్రీరూపమున ( మోహిని ) వచ్చి రాక్షసులను మాటలచే మఱపించి యమృతమంతయు దేవతలచేఁ ద్రాగించెను. అమృతము త్రాగిన వారగుటచే దేవత లెప్పుడును మరణము లేనివారైరి.

తే. గీ. కార్యమేదైన సేయంగ ♦ గడగినపుడు
దీక్షవిడువక చేసెడు ♦ ధీరమతులు
మంగళంబులఁగాంతురు ♦ మహితలమున
గానఁ దీక్షయుండవలయు ♦ దేనికైన.

# 4. ఒకరిని హింసింపఁజూచువాఁడు దానే హింసఁబొందును.

కౌరవులును పాండవులును నన్నదమ్ముల బిడ్డలు. కౌరవులలోఁ బెద్దవాని పేరు దుర్యోధనుఁడు. ఈతఁడు చిన్నతనము నుండియు బాండవుల కపకారము సేయఁదలఁచుచునే యుండెను. ఎట్లయినను వారికి రాజ్యములో భాగము లేకుండఁ

జేయవలయునని యాతఁడు నిశ్చయించుకొనెను. బాల్యమున నాటలాడుకొనునప్పుడు పాండవులలో నొక్కఁడగు భీమునికి విషముతో గలిపిన యన్నమును బెట్టించెను. పాములచేగఱిపించెను. నీటిలోఁ ద్రోయించెను. అవి యన్నియు భీముని యందు వృథాయయినవి.

పాండవులు మంచిగుణములు గలవారు. అబద్ధమాడని వారు. శౌర్యము గలవారు. జనులందఱు వారిని మెచ్చుకొను చుండిరి. అందుచే దుర్యోధనుడు వారుపురమునయుండుట కిష్టము లేక తండ్రితోఁజెప్పి వారిని రాజ్యమునుండి యావలకుఁ బంపించెను. తరువాత మరల కౌరవులకుఁ దండ్రియైనధృతరాష్ట్రుఁడు పెద్దలుబుద్ధిచెప్పగాఁ బాండవులనుబిలిపించికొంత రాజ్యమునిచ్చి యింద్రప్రస్థపురమునకుఁ బంపెను. అక్కడ పాండవులు గొప్ప వైభవముతోనుండిరి. పాండవులలోఁ బెద్దవాఁడగు ధర్మరాజు ఒక గొప్ప యాగముచేసెను. ఆయాగమునకు రాజులందఱును అనేకమైన కానుకలు తెచ్చి యిచ్చిరి. ఇదియంతయుఁ జూచి దుర్యోధనుఁడు ఓర్వలేనివాఁడై, యా పాండవులను తనతోఁ జూదమాడుటకుఁ బిలిచెను. అది మాయజూదమని తెలియక ధర్మరాజు జూదమాడెను. ఆమాయజూదమున దుర్యోధనుఁడు పాండవుల రాజ్యమును, సంపదలను గైకొని, వారిని నడవులకుఁ బంపించెను. పాండవు లడవులనుండి వచ్చిన తరువాత దుర్యోధనునితో యుద్ధము జేసి, యాతనిని పుత్రులతో మిత్రులతోఁగూడఁ జంపి రాజ్యమును గైకొనిరి. పాండవుల సంపద

జూచి యోర్వలేనివాఁడై. వారిని హింసింపఁదలఁచిన దుర్యోధనుఁడు తుదకుఁ దానే హింసింపఁబడెను.

"ఆ. ఒకనిఁజెఱచెదమని యుల్లమందెంతురు
తమదు చేటెఱుఁగరు ధరనునరులు
తమ్ముఁ జెఱచువాఁడు దైవంబుగాఁడకో
విశ్వదాభిరామ వినురవేమ."

## ౫. శరణన్న వానిని గాపాడవలెను.

పూర్వము దశరథుఁడను నొక రాజుగలఁడు. అతనికి రామ, భరత, లక్ష్మణ, శత్రుఘ్నులను నలుగురు కొడుకులుండిరి. ఇందులో రాముఁడు తండ్రిసత్యముగాపాడుటకు భార్యయగు సీతతోడను, తమ్ముఁడగు లక్ష్మణునితోడను నడవులకు బోయెను. వారు దండకారణ్యమునం దుండఁగా రావణుండను రాక్షసరాజు రామలక్ష్మణులు పర్ణశాలలో లేని సమయము జూచి సీతన్ను దొంగిలించుకొనిపోయెను. రామలక్ష్మణులుపర్ణశాలకువచ్చి సీతనుగానక మిగుల విచారించి యామెను వెదకుచు బోయిరి. కొన్నాళ్ళకు వారు కిష్కింధ యను నొక పురిము జేరుకొని, యక్కడ వానరులరాజైన సుగ్రీవునితో స్నేహాము జేసికొనిరి. తరువాత రాముఁడు సుగ్రీవుని సహాయమున వానరసేనను జేర్చుకొని, లంకకేగి రావణునితో యుద్ధము

సేయుటకు బయలు దేరి సైన్యములతో సముద్రతీరమున విడిసియుండెను.

లంకపైకి రాముఁడు వచ్చుచున్నాఁడని విని రావణుఁడు యుద్ధప్రయత్నము సేయసాగెను. అప్పుడాతని తమ్ముఁడైన విభీషణుఁడు రామునకు సీతనిచ్చి శరణుఁ బొందుమని చెప్పెను. విభీషణుఁడు రాక్షసులలో బుట్టినవాఁడైనను మంచిగుణములు గలవాఁడు. రావణుఁడు తనకా మాట జెప్పినందుకు గోపించి విభీషణునిఁ నిండుసభలో నవ్వెను. అంతట విభీషణుఁడు మారుపలుకక తిన్నగా రాముని సన్నిధికిఁ బోయి "నేను రావణునకుఁ దమ్ముఁడను. నా పేరు విభీషణుఁడు. క్రూరుఁడైన నా యన్న యొద్ద నుండుటకిష్టము లేక నిన్ను శరణు వేడ వచ్చితిని. రక్షింపుము." అని కాళ్ళమీఁద బడెను. ఆసమయమున వానరులలో గొందఱు విరోధికి దమ్ముఁడు కావునఁ జేర్చికొనవలదని పలికిరి. మఱికొందఱు రక్షింపవచ్చుననిరి. రాముఁడిదియంతయుఁ జూడక "శరణన్నవాఁడు పగవాఁడైనను రక్షించి తీరవలయును" అని పలికి విభీషణునకు అభయమిచ్చెను.

ఆ. "చంపదగినయట్టి శత్రువు తనచేత
జిక్కెనేని కీడు సేయరాదు
పొసగ మేలుచేసి పొమ్మను టేచాలు
విశ్వదాభిరామ వినురవేమ."

# నీచుని గౌరవించినను వానిగుణము విడువడు.

ఒకయడవిలో నెప్పుడును తపస్సు చేసుకొనుచుండు మునీశ్వరుఁడొకడుండెను. ఒకనాడు అతఁడు స్నానమునకునదికి బోయి వచ్చుచుండఁగా నెక్కడనుండియో యొకకుక్క వచ్చి తోకనాడించుచు నతని వెంటఁబడి యాశ్రమమునకు నచ్చెను. మునీశ్వరుఁడు మిగుల జాలిబొంది దానిని దనయొద్దనుంచుకొని పెంచుచుండెను. ఆకుక్కగూడ నాతనియందు విశ్వాసముగలిగి యెప్పుడును ఆశ్రమము గాచియుండెను. ముని యెక్కడికైన బోయిన నదిగూడ బోవుచుండును. ఏదియైన క్రూరజంతువు దానిం దరుముకొనివచ్చినచో మునియొద్దకుఁ బరుగెత్తుకొని వచ్చును. ఎప్పుడైన సింహముగాని పెద్దపులిగాని దానిని తరుముకొని వచ్చినప్పుడు మునీశ్వరుఁడు తన మహిమచేత దానిని మరియొకరూపముగా మార్చి గెలిపించుచుండును.

ఇట్లు ప్రతిదినము మునిదయవలన అనేకమైన జంతువుల రూపముదాల్చి యాకుక్క అడవిలో దిరుగుచుండెను. ఒక సమయమున నది శరభరూపముదాల్చి తన మనస్సులో నిట్లనుకొనెను. "ఈమునీశ్వరుఁడు నన్ననేక రూపములుగా మార్చుచున్నాడు. ఈతనికి నాయం దిప్పుడున్న దయ యెల్లకాలము నుండునో లేదో! కావున నేను ఈతని జంపితినేని నేనెప్పుడు నిట్లేయుందును." కుక్క యీవిధముననాలోచించు

చుండఁగా మునీశ్వరుఁడు వచ్చెను. అతఁడు దాని నీచమైన యాలోచనము నెఱిఁగి “నిన్ను నేను దగ్గఱ జేర్చి పెంచినానన్న సంగతి మఱచి నన్నే చంపఁదలఁచుచుంటివి. ఇందు నీవలన దప్పులేదు. నీచగుణముగల నిన్నుఁ జేర్చుట నాదితప్పు. కావున నీవెప్పటియట్ల కుక్కవై యుండు”మనెను. అంతట నది యెప్పటి రూపముదాల్చెను. “నీచున కెంత గౌరవముచేసినను తన గుణమును విడువడు.”

క. “కనకపుసింహాసనమున
శునకము గూర్చుండఁబెట్టి శుభలగ్నమునన్
దొనరఁగఁ బట్టముగట్టిన
వెనుకటిగుణ మేలమాను వినురా సుమతీ.”

## 7 కఠినచిత్తుని మనస్సు కరగింపలేము

రావణుఁడను రాక్షసుల రాజొకఁడుండెను. వాని రాజధాని లంకాపురము. వాని భార్య పేరు మందోదరి. రావణుఁడు బ్రహ్మనుగూర్చి తపస్సుజేసి యనేకమైనవరములను బొందెను. ఆ వరముల గర్వముచేత నాతఁడు గర్వించి లోకముల నన్నిటిని బాధించుచుండెను. మునులనుహింసించుచుండెను. ఆదుర్మార్గునిచావుకొఱకు అందరునుఎదురుచూచువారై యుండిరి. ఇట్లుండ నాతఁడు సీతారామలక్ష్మణులుదండకారణ్యములో నుండగా రామలక్ష్మణులులేని సమయముజూచి

సీతను దొంగిలించుకొని వచ్చెను. ఇట్టి కార్యము వలదని రాక్షసులలో కొందఱు వానికిఁ జెప్పిరి. కాని,యతఁడు వినక యూమెను దెచ్చెను. అంతఁ గొన్నాళ్లకు రాముఁడు సీతఁ జాడల నెఱిఁగి వానరబలమును గూర్చుకొని లంకపై దండెత్తి వచ్చెను. రావణునకును రామునకును భయంకరమైనయుద్ధము జరిగెను. ఆయుద్ధములో రాముఁడు రావణుని బంధువులను, కొడుకులను, మంత్రులను జంపెను. ఇక రావణుఁడు మాత్రమే మిగిలియుండెను. అప్పుడు వాని భార్య నెమ్మదిగా వానియొద్దకుబోయి యిట్లు చెప్పెను. " నీవు సీతను దొంగిలించుకొని వచ్చిన కారణమున రామునితో యుద్ధము కలిగినది. దైత్యులందఱును జచ్చిరి. లంకకు కీడు వచ్చినది. రాముఁడు సామాన్యుఁడుగాఁడు. ఆదినారాయణమూర్తి. సీత లక్ష్మీదేవి. ఇప్పుడయినను నీవు నామాట విని సీత రామున కిచ్చి శరణుబొందుము. అతఁడు నిన్ను దప్పక రక్షించును. లేదేని నీవుగూడ రాముని చేతిలోఁ జచ్చెదవు. నీమూలమున రాక్షసులందఱు జచ్చిరి. ఇప్పటికైన నామాట వింటివేని ఈయున్నవారితో నీవు సుఖింపవచ్చును. పౌరుషము వదలుము. శాంతమును బూనుము. మంచి చెడ్డలు విచారింపుము."

పాపము! ఈ విధముగా మందోదరి మగని కెన్నో నీతులు చెప్పెను. ఆమె యెన్ని చెప్పినను నాతఁడు వినలేదు. చచ్చుటకైనను నొప్పుకొనెనుగాని కఠినమైన తన మనస్సును త్రిప్పుకొనలేదు. తుదకు మందోదరి ప్రాణములు విసిగి

"కఠినచిత్తుని మనస్సు కరిగించుట కష్టము. బ్రహ్మవ్రాత'।
అని మరల మాటాడక యుండెను. తరువాత రావణుఁడు
యుద్ధములో రామునిచే గూలెను.

" ఆ- పరగజాతిగుండు పగులగొట్టగవచ్చు
కొండలన్ని పిండి గొట్టవచ్చు
కఠిన చిత్తుమనసు కరిగింపఁగారాదు
విశ్వదాభిరామ వినురవేమ. "

## 8· దురాశవలన హానికలుగును

విజయపురమను పేరుగల నగరమొకటి కలదు. దానికి సమీపమున నొక యరణ్యముండెను. ఆయరణ్యమున నొకనాఁడొక బోయ వేటకేగి యొక పుట్టకు దగ్గరగా నొక వనగజముండుటఁజూచి యాపుట్టనెక్కి తనయొద్దనున్న వాడిగల కత్తిచే దాని తుండమును నఱికి చంపెను. అప్పుడా పుట్టనుండి యొక పెద్ద త్రాచుపాము వచ్చి యాబోయవానిని కఱచెను.

అంత తనచేతనున్న కత్తితో నాపామునుజంపి విషమెక్కుటచే వాఁడుగూడ నేలఁబడి ప్రాణములు విడిచెను. ఆసమయమున నచ్చటికొక నక్కవచ్చి సంతోషించుచుఁ దనలో నిట్లనుకొనెను. "నాకుఁదినుటకీయేనుగు ఆఱునెలలవఱకు సరిపోవును, బోయవాఁడేడురోజులవఱకు సరిపోవును. సర్పమొక

చినము. ఈబోయవింటి నరము ఈపూటకు సరిపోవును'' అని తలఁచిబోయవాఁడు ఎక్కుపెట్టియుంచిన బాణమునుసమీపించి దానికున్న నరములను గొఱుకసాగెను. కొంతసేపటికి పట్లుతప్పి ఆధనువుకొమ్ము విడిసి యానక్క కంఠముననాటెను. వెంటనే యది కేకలిడుచుఁ క్రిందబడి కొట్టుకొని ప్రాణములు విడిచెను.

" దురాశ యెప్పటికిని నుండ రాదు. ''

ఆ. "నీళ్ళలోని మీను నెఱిమాంస మాశించి
గాలమందు జిక్కు కరణి భువిని
ఆశదగిలి నరుడు నాలాగె చెడిపోవు
విశ్వదాభి రామ వినుర వేమ.''

## 9. అల్పులు తమలోఁదాము పోరాడి పెంజుకడకు బోయిన హానివచ్చును

పూర్వము నర్మదానదీతీరముననున్న యడవిలో నొక పెద్దపులి వసించుచుండెను. అది యన్నిమృగములయెదుటను మిగుల ధర్మబుద్ధిగలదానివలె నటించు చుండెను. ఒరులను హింసించుటయన్న నిష్టములేని మనస్సుజూపుచుండెను. దాని కపటబుద్ధి గ్రహింపజాలక తక్కిన మృగములన్నియు దానిం జేరి యిట్లు పలికెను. " ఓవ్యాఘ్రమా! నీవు ధర్మబుద్ధిగల వాడవు. నీవుమాకు రాజువైయుండుము. మేమెల్లరము నీవు

చెప్పినట్లు వినుచుందుము. ” అందులకు బులి సమ్మతించెను. ఇట్లుండ నొక్కదినమున నొక కుందేలును, కపింజలమును నెందులకో కలహించి యాకలహమును దీర్పుమని పులియొద్దకు వచ్చి వేడుకొనిరి. అప్పుడు పులి వానిజూచి యిట్లు పలికెను. “నేను పెద్దవాడనైతిని. చూపుతక్కువ. దూరమునుండిమాట వినుశక్తిగూడ లేదు. దగ్గఱకువచ్చి మీ కలహమును గూర్చి చెప్పుకొనుఁడు.” ఆమాటలు విని శశకమును గపింజమును పులిని సమీపించిరి. అంతట పులి ముందు కుందేలును బట్టుకొని కొఱికి భక్షించి, తరువాత రెండవ దానినిగూడ నట్లే చేసెను.

తే. గీ. అల్పుడెపుడైన నిట్టి । పోరాడి
దానికూర్చి పెద్దల సన్ని । ధానమునకు
తగవు దీర్పుఁడటంచును । త్వరిత గతిని
జేరగారాదు, చేరినఁ । జేటువచ్చు.

# 10 గర్వమువలన నెట్టివాడైననుచెడిపోవును

పూర్వకాలమున నహుషుఁడను నొకచక్రవర్తిగలఁడు. అతఁడనేకమైన ధర్మకార్యములను చేయుటయేగాక నూరు అశ్వమేధయాగములను జేసెను. అందుచేత నతఁడుఇంద్రపదవిని బొందెను. అంతకు మున్ను భూలోకమునఁ జక్రవర్తియై

యున్న యాతనికి, దేవతా రాజ్యము వచ్చినంతనే గర్వముకలిగెను. ఆగర్వముచేతఁ నాతఁ డెవ్వరిని లక్ష్యముసేయక తన యంతవాఁడు లేడని తిరుగసాగెను. మునులను గూడ నవమానింపసాగెను. తానొక పల్లకీలోఁ గూర్చుండి దానినివారిచేత మోయించెను. ఇట్లుండ నొక సమయమున నాతని యొద్దకు అగస్త్యుఁడను నొక మునీశ్వరుఁడు వచ్చెను. నహుషుఁ డాతని కొక ట్రాడుచూపి ,,పాము పా''మని భయపెట్టెను. నహుషుని మాటలకు మునీంద్రుఁడు కోపించి ,,నీవు పామువగుదువు గాక'' యని శాపమిచ్చెను.

అప్పుడు గర్వముచేత తనకిట్టి శాపము కలిగెనని యేడ్చి మునీశ్వరుని కాళ్ళమీఁదబడి రక్షింపుమని వేడుకొనెను. మునీశ్వరుల మనస్సు వెన్నవంటిది వారు సాధారణముగా నెవరికిని నపకారము సేయరు. నహుషుని యేడ్పునకు మునీశ్వరుఁడు జాలిఁబొంది యిట్లనెను. ,,ఓ రాజా! నీవేడ్చినందువలనలాభము లేదు. నీగర్వమే నిన్నింతవఱకుఁ దెచ్చినది. నేను శాపము త్రిప్పలేను. దానిని నీవనుభవింపకతప్పదు. కానినీకు నేనొక్క యుపకారము చేసెదను. నీవు పామువైనను మనుష్యులు మాట్లాడినట్లే మాట్లాడుదువు. తెలివి గలిగి యుందువు. పామువై యడవిలో నీవుండఁగా పాండవులలో పెద్దవాఁడగు ధర్మరాజువచ్చి నీశాపము పోఁగొట్టును. ''

అంతట నహుషుఁడు పామైభూమియందొకయడవిలో

తిరుగుచుండెను. కొన్నాళ్ళకు అచ్చటకు భీముడు (పాండవులలో రెండవవాఁడు) వచ్చెను. నహుషుఁడు వానిం బట్టుకొనెను. భీముఁడుగొప్పబలముగలవాఁడైనను పామైయున్ననహుషునికి జిక్కి తప్పించుకొనలేకపోయెను. భీముడెంతసేపటికిని నింటికి రాకపోవుటచే వానిని వెదకుచు ధర్మరాజు అడవిలోనికి వచ్చెను. భీముఁడు నహుషుని చేతిలో జిక్కియుండుట జూచి నెమ్మదిగా నహుషునిజేరి యాతని సంగతి నడిగెను. నహుషుఁడు సర్వము వినిపించి, కొన్నిప్రశ్నములు ధర్మరాజు నడిగెను. వానికి ధర్మరాజు బదులు చెప్పెను. నహుషుఁడు సంతోషించి భీముని విడచి తన శాపమును గూడ వాసి పుణ్యలోకమునకుఁ బోయెను.

"ఆ. అల్పుడైనవాని క ౹ ధిక భాగ్యముగల్గ
దొడ్డవారిఁదిట్టి ౹ తొలగొట్టు
అల్పజాతి మొప్పె౹ యధికుల నెఱుఁగునా
విశ్వదాభిరామ ౹ వినరవేమ."

## 11. భక్తితో పెట్టిన యన్నము పట్టెడైనను జాలును

పాండవులను కౌరవులు మాయజూదములో నోడించి వా[illegible] బదమూడేడులు అడవులలో నుండిరమ్మని పంపించిరి.

పాండవులు ధర్మబుద్ధిగలవారు. కావున సట్లుచేసివచ్చిరి. అట్లు వచ్చిన తరువాత వారి రాజ్యభాగము వారికిమ్మని యడుగుటకుఁ గృష్ణుని గౌరవులయొద్దకుఁ బంపిరి. కృష్ణుఁడు కౌరవులతో సంగతులన్నియు మాట్లాడిన తరువాత, వారిలో పెద్దవాడైన దుర్యోధనుఁడా కృష్ణుని దన యింటికి భోజనమునకు రమ్మని పిల్చెను. దుర్యోధనునకుఁ గృష్ణునియందు నిజముగా భక్తి కలిగి భోజనమునకు పిలువలేదు. ఈ సంగతి కృష్ణునకుఁ దెలియును. కృష్ణుఁడు దుర్యోధనునిజూచియిట్లనెను. "దుర్యోధనా! నీవు నన్ను నీయింటికి విందునకు బిలిచితివి. సంతోషించితిని. కాని నీకు నాయందు నిజమైన భక్తిలేదు. ఎందుచేతనన, పాండవులు నాకుస్నేహితులు. వారు నీకు విరోధులు. అందుచేత నేను గూడ నీ యింటిలో నన్నము తినఁకూడదు. విదురుడు నాకుఁ బరమభక్తుడు. అతఁడు నన్నుఁ దన యింటికి విందుకు రమ్మని పిలిచినాఁడు. కావున నాతని యింటికేగుదును. భక్తితో పెట్టిన యన్నము పట్టెడైనను చాలును" అని పలికి విదురుని యింటికేగెను.

ఆ. "గంగగోవుపాలు గంటెడైననుజాలు
గడివడైన నేమి ఖరముపాలు
భక్తి గలుగుకూడు పట్టెడే చాలురా
విశ్వదాభిరామ వినురవేమ.

# 12 విద్యలేనివాఁడు పూజింపఁబడఁడు.

పూర్వము వసుదేవుఁడను వానికి బలరామ కృష్ణులను నిద్దఱు కొడుకులుండిరి. వీరిరువురును చిన్నతనము నుండియు మిక్కిలి శౌర్యముగలవారై యుండిరి. చిన్నతనమునందే దుర్మార్గులయిన రాక్షసుల ననేకమందినిజంపిరి. వీరికొక మేనమామ గలఁడు. వాఁడు మధురాపురమునకు రాజు. వాని పేరు కంసుఁడు. కృష్ణుఁడు పుట్టినప్పటినుండియు వానిమూలమున దనకు హాని కలుగునని వానినిజంపుట కుపాయములుజూచుచుండెను. కృష్ణుని తల్లిదండ్రులను చెరలోఁ బెట్టెను. అప్పుడు బలరామ కృష్ణులు, మేనమామ యనియైనఁ దలపకుండ గంసుని జంపి తల్లిదండ్రుల చెఱఁ బాపిరి.

బాలురైన బలరామ కృష్ణులు కంసుని జంపినంతనే వారి కీర్తి నాలుగు దిక్కుల వ్యాపించెను. అనేకమందిపెద్దలు, మునీశ్వరులు మొదలగువారు వారి యొద్దకు వచ్చుచుఁ బోవుచుండిరి. అప్పటికి బలరామకృష్ణులేమియుఁ జదువుకొనియుండ లేదు. ఎవ్వరైన పెద్దలు మీరేమి చదువుకొనిరని యడిగి నప్పుడు, వారేమియు బదులు చెప్పక యూరకొనుచుండిరి. అప్పుడు బలరామకృష్ణులు "మనమెంత శౌర్యముగలవారైనను విద్యలేకపోయినచోఁ బూజింపఁబడము. విద్య యున్నవాఁడు సభలలోఁ బూజింపఁబడును. కావున మనము విద్యనేర్చుకొనుటమంచిది." అని తలంచి కాశీపురమునకుఁబోయి యచ్చట

సాందీపుఁడను గురునియొద్ద విద్యలన్నియు బూర్తిగా నేర్చుకొనిరి. నాటినుండియు బలరామకృష్ణులు కేవలము పరాక్రమవంతులేగాక అన్నివిద్యలు నేర్చిన మహాత్ములని యందఱిచేతను బూజింపఁబడుచుండిరి.

ఆ. "విద్యలేనివాఁడు విద్యాధికులచెంత
నుండినంత బండితుండు కాడు
కొలని హంసలకడఁ గొక్కెరయున్నట్లు
విశ్వదాభిరామ వినురవేమ."

# 13. గుణవంతుని జన్మమువలన గులమునకు గీర్తివచ్చును.

పూర్వమొక యడవిలో కాపవ్యుఁడను నొక బోయవాఁడు వసించుచుండెను. వాఁడు విలువిద్యయందు మిక్కిలి నేర్పరి. వాఁడుకులమునకుబోయవాఁడైనను ధర్మములన్నియు బాగుగ దెలియును. మంచిగుణము లన్నియు వాని యొద్దకు జేరియుండెను. వీనికి వృద్ధులైన తల్లిదండ్రులుండిరి. ఆబోయవాఁడు ప్రతిదినము ప్రొద్దుననేలేచి తల్లిదండ్రులకు జేయవలసిన సేవలను జేసినపిమ్మట మఱియొకపనిజూచుకొనుచుండును ఈతఁడు కాపురమున్న స్థలమునకు సమీపమున ననేకమంది మునులు పర్ణశాలలు వేసికొని తపము చేసికొనుచుండిరి. కాపవ్యుడా మునులను దుష్టజంతువుల వలన భయములేకుండ

గా పాడుచుండుటయేగాక, యెప్పుడును వారికి ఫలములు మొద లగునవి తీసికొనిపోయి భక్తితో నిచ్చుచుండును. మునీశ్వరు లును నాతనిభక్తికి మెచ్చి దీవనలిచ్చుచుండురు.

ఇట్లుండ, వాని ధర్మబుద్ధికి సంతోషించి యాప్రాంత మునను న్న జనులందఱును వానియొద్దకువచ్చి "నీవు బోయ వాఁడవైనను మంచిగుణములు కలవాడవు. మంచిగుణములు గలవాఁడు కులహీనుఁడైనను పూజింపబడునని పెద్దలు చెప్పు దురు. కావున నీవుమాకు రాజువై యుండుము" అనిపలికిరి. అందులకు బోయవాడిట్లు బదులుచెప్పెను. "మీరునాయందు జూపినదయకు సంతోషించితిని. కానియొక్క సంగతిమీతోఁ జెప్పవలసియున్నది. నామనస్సు ఎప్పుడును ధర్మములందే నడ చుచుండును, శిశువులను, స్త్రీలను, మునులను, నెవ్వరునుజంప రాదు. ఆడువారిని నెవ్వరు చెరపట్టరాదు. ఏమృగములలో నైన నాడుదానింజంపరాదు. గోవులకును, బ్రాహ్మణులకును బాధకలిగింపరాదు. బలవంతముజేసి యెవ్వరియొద్దను ధనము తీసికొనరాదు. ఇట్టి ధర్మములన్నియు మీరు బాగుగఁ దెలిసి కొని నడచుకొంటిరేని మీరు చెప్పిన దానికొప్పుకొందును." బోయవాని మాటలకు వారు సంతోషముతో నొప్పుకొనిరి. నాటినుండియు వాఁడువారికి రాజై ధర్మముతోఁ బాలించి మిగుల కీర్తిబొందెను. వాఁడు బోయవాఁడైనను మంచి గుణ ములు గలవాడగుటచే, వాని కులమునకు గొప్పకీర్తివచ్చెను.

"ఆ. కులములోన నొకఁడు గుణవంతుఁ డుండిన
గులము వెలయు వాని గుణముచేత
వెలయ వనములోన మలయజమున్నట్లు
విశ్వదాభిరామ వినురవేమ."

## 14 కోపమువలన ఘనత చెడిపోవును

దుర్వాసుఁడను నొక మునీశ్వరుఁడుకలడు. అతఁడుగొప్ప తపస్సుచేసినవాఁడైయెనను మిక్కిలి కోపము గలవాఁడై యుండెను. ఆతని జూచినచో దేవతలుగూన భయము బొందుచుందురు. అతఁడొకనాఁడుభూలోకముననున్న అంబరీషుడను రాజుగృహమునకువచ్చెను. ఆదినమున నతఁడుద్వాదశీవ్రతము సేయుచుండెను. అప్పుడు రాజు తనయింటికివచ్చిన దుర్వాసుని మిగులగౌరవించి భోజనముచేయుమనికోరెను. దుర్వాసుఁడు సమ్మతించి స్నానమునకు నదికిఁ బోయెను. దుర్వాసుని కొరకు భోజనము సేయకుండ బ్రాహ్మణుండును అంబరీషుఁడున్ను కనిపెట్టుకొని యుండిరి. ఎంతసేపటికిని దుర్వాసుఁడు రాకయుండెను. ద్వాదశి ఘడియలు దాటిన తరువాత భోజనము చేసినచో వ్రతముయొక్క ఫలముండదు. అందులకై రాజు బ్రాహ్మణులతో నాలోచించి కొంచెము జలములఁ దాగియుండెను. తరువాత దుర్వాసుఁడువచ్చి రాజుచేసినపనికి కోపగించి యతనిపైకి యొకశక్తినిబంపించెను. అంబరీషుఁడు ఆశక్తి

వలస దనకుబాధలేకుండరక్షింపుమని విష్ణుమూర్తిని వేడు కొనెను. అప్పుడువిష్ణుమూర్తి భక్తుని రక్షించుటకు చక్రమును బంపెను. ఆచక్రమునిప్పులుగ్రక్కుచువచ్చి దుర్వాసుడువిడిచిన శక్తినిమాయుచేసి దుర్వాసుని దఱుమసాగెను. ముందు దుర్వాసుఁడు వెనుకశక్తి ఈప్రకారముగా దుర్వాసుఁడు అన్నిలోకములకును పరుగెత్తెను. చక్రమువలన దనకుఅపాయముగలుగకుండ రక్షింపుమని యామునీశ్వరుఁడు బ్రహ్మను ఈశ్వరుని వేడుకొనెను. వారిద్దరును రక్షింపజాలమనిరి. అంతట దుర్వాసునకు మఱియొకమార్గమేమియుదోచక తిన్నగా వైకుంఠమునకుఁ బరుగెత్తి విష్ణుమూర్తి కాళ్ళమీద పడెను. అప్పుడు విష్ణుమూర్తి దుర్వాసుని యిట్లు పలికెను. నీవు కోపము తప్ప మరియొకటియెఱుఁగవు. నీకోపమే నిన్నుయిట్లుచేసినది. ఏపాప మెఱుగని భక్తుడైన యంబరీషునిపై శక్తినిబంపితివి. నాభక్తుల కెవ్వరైన హానిఁ జేసినచో నేను సహింపను. కావున నీవిప్పుడు తిన్నగాబోయి అంబరీషునే శరణము వేడుకొనుము అతఁడే నిన్నురక్షించును. ”

విష్ణుమూర్తి మాటలువిని దుర్వాసుఁడు తొందరగా బోయి „ తెలియక నీకు అపరాధము సేయదలఁచితిని. కావున నన్ను రక్షింపు”మని పలికెను. అప్పుడు అంబరీషుఁడు విష్ణుమూర్తిని బ్రార్థించెను. చక్రము శాంతిబొంది శ్రీహరి దగ్గరకు బోయెను. దుర్వాసుఁడు అంబరీషుని భక్తికిని, మహిమకును మిక్కిలి సంతోషించి దీవించి వెడలిపోయెను.

దుర్వాసుఁ డెంత తపస్సుచేసినవాఁడైనను గోపమువలన నిందఁ బొందెను. కావున నెట్టివానికిని గోపము తగదు.

ఆ. "కోపమునకు ఘనత కొంచమైపోవును
గోపమునను మిగుల గోడు గలుగు
గోపమడంచెనేని గోర్కెలు నీడేరు
విశ్వదాభిరామ వినురవేమ"

# 15 డంబముపనికిరాదు

మత్స్యదేశమునకు రాజయిన విరటుఁడను వాని కొక కొడుకుండెను. వాని పేరు ఉత్తరుఁడు. ఈతఁడు బాలుడైనను డంబములు పలుకుటలో మిక్కిలి గొప్పవాఁడు. తనకు జేతకాని పని యొకటియు లేదని పలుకుచుండును. ఎంతటివానినైనను యుద్ధములో గెల్తునని చెప్పుచుండును. ఇట్లుండ నొకసమయమున కౌరవులువచ్చి విరటుని గోవుమందలను బట్టుకొనిరి. ఈ సంగతిగోపాలకులువచ్చి విరటునకు జెప్పిరి. అప్పుడక్కడనున్న యుత్తరుడదివినితండ్రినిజూచి ఇట్లుపలికెను. "నాయనా! కౌరవులు మనసంగతి తెలియకుండ గోవులను బట్టుకొనినవాఁరు. కానిమ్ము. ఇప్పుడు నేను వారిపైకిబోయి యుద్ధము జేసిగోవులను తెచ్చెదను. నాబలము, శౌర్యము, జూచి కౌరవులు యుద్ధము విడిచి పరుగెత్తునట్లు చేసెదను" అనిపలికి వారియొద్ద బృహన్నల

యను పేరుతో మారువేషముననున్న బృహన్నలను సారథిగా జేసికొని యాయుత్తరుడు కౌరవులపైకి బోయెను.

ఇంటియొద్ద పలికిన డంబములన్నియు మఱచి పోయి యుత్తరుఁడు కౌరవసైన్యమునుజూడగనేభయముబొంది రథము దిగిపాఱిపోవసాగెను. బృహన్నల వానిని రథముపై గూర్చుండుమని బలవంతపెట్టెను. "ప్రాణములుండినబలుసాకైనను దిన వచ్చును. నాకు యుద్ధమక్కరలేదు. కౌరవులను నేను గెలువ లేను.'' అని యుత్తరుఁడుగట్టిగాజెప్పితన్నువదలిపెట్టుమనిబృహన్నలను బ్రతిమాలుకొనెను. అప్పుడు బృహన్నల వానిమాటలకు నవ్వి తాను రథమెక్కి యుత్తరుని సారథిగాఁజేసి కౌరవులతోఁబోరిఁ గోవులను మరలించుకొని వచ్చెను.

ఎప్పుడునుజేయలేనిపనిఁ జేయుదునని డంబములు పలుకరాదు.

తే॥ గీ॥ ఎట్టిఘనుఁడైన దనబల • మెదుటిబలము
నెఱిఁగి బోరంగ వలెనని • నిట్లుగాక
యున్న గౌరవబలముతో • యుద్ధమునకు
నరిగినట్టి యాయుత్తరు • కరణి యగును.

# 16. ఆపత్కాలమున నడ్డుపడినవాడే నిజమైన బంధువు.

పూర్వము విష్ణుశర్మ, గోవిందశర్మలను పేరుగల ఇద్దఱు అన్నదమ్ములు గలరు. వీరిద్దఱు తండ్రియాస్థిని సమముగా బంచుకొని యన్యోన్యముగలిగి వేర్వేరుగాఁ గాపురము సేయుచుండిరి. కొన్నాళ్ళకు విష్ణుశర్మ మఱియొకపట్టణమునకు బోయి వాసము చేయుచుండెను. అక్కడ నతఁడు ధనమును బాగుగా సంపాదించి భాగ్యవంతుడని పేరు పొందెను.

గోవిందశర్మదగ్గఱ సంపాదనశక్తిలేదు. అన్నతో పంచుకొన్న ధనముక్రమ క్రమముగా తగ్గిపోయి నిరుపేదయయ్యెను. పూటగడచుటకష్టముగా నుండెను. పిల్లలువానిం జేరి, 'అది తెచ్చిపెట్టుఇది తెచ్చిపెట్టు'మనియడిగినప్పుడెల్లకన్నులనీరుగార్చుచుండును. ఒకనాఁడు వానిభార్య వానింజూచి "మీరు ఈవిధమున విచారించినందువలన లాభములేదు. మీ యన్నగారు మిక్కిలి భాగ్యముతో నున్నారు. ఆయనకు మీయందు ప్రేమకూడ గలదు. కావున నాయనదగ్గరకుబోయి మీస్థితినిగూర్చి చెప్పుకొనుడు. ఆయన మీకు సహాయము సేయును" అని చెప్పెను. భార్యమాటలు విని గోవిందశర్మ విని యొకనాఁడు బయలుదేరి తన యన్నయైన విష్ణుశర్మదగ్గరకుఁ బోయెను. విష్ణుశర్మ భార్యయు బిడ్డలుకూడ గోవిందశర్మను అతి ప్రేమతోఁ

జూచుచుండిరి. ఇట్లుగోవిందశర్మ పది దినము లన్న గారియింట నుండి ఒకనాఁడు రహస్యముగా నన్నతో తన దుస్థితిఁ జెప్పు కొనెను. అతని పేదఱికమునకు విష్ణుశర్మ మిగుల విచారించి ప్రేమగలవాడై విశేషమైన ధనము నిచ్చి పంపెను.

"ఆ. ఆపదగలవేళ నరసిబంధులజూడు
భయమువేళ జూడు బంటుతనము
పేదవేళజూడు పెండ్లాము గుణమును
విశ్వదాభిరామ వినుర వేమ."

## 17. తనుఁదాను పొగడుకొనఁగూడదు

పూర్వము యయాతి యను నొకరాజుండెను. అతఁడు రాజ్యము చేయునప్పుడు అనేక ధర్మములును, యాగములును జేసి, భగవంతుని దయచేత స్వర్గమున కేగెను. ఒకనాఁ డింద్రుఁడు దేవలోకములో నొకపెద్దసభ జేసెను. ఆ సభకు మునీంద్రులు మొదలగువారు వచ్చిరి. అందులో యయాతి గూడ నుండెను. అప్పుడుపుణ్యపాపములనుగూర్చియాసభలో యొక ప్రశ్నవచ్చెను. ఎక్కువ పుణ్యముచేసిన వారెవ్వరని యింద్రుఁడడిగెను. మునీంద్రులాతని ప్రశ్నలకు బదులుచెప్ప జాలక యుండిరి. అంతట యయాతి లేచి యింద్రునితో "మహేంద్రా! నేను భూమిని ధర్మముతోఁ బాలించితిని. దుష్కార్యముల నెప్పుడును జేయలేదు. ఎన్నో యాగములు

చేసితిని. లెక్కింపలేని దానముల నిచ్చితిని. అన్నిటికంటె నెక్కువగాఁ తపస్సుచేసితిని. ఇట్టి కార్యములఁ జేయుటచేతనే నాకీ స్వర్గము దొరికినది" అని తనుఁదాను పొగడుకొనుచు జెప్పెను. యయాతి మాటలకు నవ్వి యింద్రుఁడాతనిం జూచి "నీవు నిజముగా గొప్పకార్యములను జేసియుందువు. కాని తనుఁదాను బొగడుకొనుట యెట్టివానికిని దగదు. దానివలన చేసినపుణ్యము నశించును. నీయట్టి గర్వమున్న వాడు స్వర్గములో నుండదగడు" అని పలికి యాతని స్వర్గము నుండి భూమికి దోలియించెను.

ఎవఁడును తాను చేసిన కార్యములను పొగడుకొనరాదు.

"ఆ. నేరనన్నవాఁడు నెఱజాణ మహిలోన
నేర్తునన్నవాఁడు నిందఁజెందు
ఊరకున్నవాఁడె యుత్తమయోగిరా
విశ్వదాభిరామ వినురవేమ."

## 18. తన ధర్మమే తన్ను గాచును.

సిరియాళుఁడను రాజుగలఁడు. అతఁడు శివభక్తుఁడు. ధర్మము తప్పనివాఁడు. ప్రతిదినము ఒకయతిథియైన తన పంక్తినిలేనిదే భోజనము చేయువాఁడుకాఁడు. అతఁడట్టిదీక్షను బూని యుండెను. ఒకనాఁడు పరమేశ్వరుఁ డాతని గుణమును

పరీక్షింపదలఁచి సిరియాళునియింటికి కెవ్వరును నతిథులు రాకుండఁ జేసెను. ఎంతప్రొద్దు పోయినను నాతనియింట భోజనము సేయుట కెవ్వరును రారైరి. యెవ్వరైన యతిథులు దొరకుదురేమోయని యారాజే పట్టణములో వెదకుటకు బయలుదేరెను. ఆ సమయమునఁ బరమేశ్వరుఁడే మునివేషమున నాతని కెదురు వచ్చెను. సిరియాళుఁడాతని జూచి నమస్కరించి తనయింటికి భోజనము సేయుటకు రమ్మని వేడెను. తన యిష్టము వచ్చిన పదార్థము వండిపెట్టినచో వచ్చెదనని మాయముని చెప్పెను. సిరియాళుఁడు సమ్మతించి యాతని నింటికిఁ దోడ్కొని వచ్చెను. వచ్చిన తరువాత నేమి పదార్థములు కావలయునని రాజును, నాతని భార్యయు మునీశ్వరుని నడిగిరి. "మీకుమారుని జంపి వాని మాంసమును వండిపెట్టు"డని యాతఁడు చెప్పెను. ఇప్పుడా రాజేమిచేయును! ఏదికావలసిన దానిం బెట్టెదనని మొదట చెప్పియుండెను. ఇప్పుడామాట తప్పినచో ధర్మహాని కలుగును. దానివలన బాపము సంభవించును. రాజున కేమిచేయుటకును తోచలేదు. పాఠశాలకుఁ బోయిన సిరియాళుని కొడుకయిన మతిమంతుఁడప్పుడేవచ్చి యేడ్చుచున్న తల్లిదండ్రులను జూచి కారణమడిగెను. మునీశ్వరుని కోరిక చెప్పలేక చెప్పలేక మతిమంతునకు సిరియాళుఁడెఱింగించెను.

మతిమంతుఁడు బాలుఁడైనను ధైర్యముబూని తల్లిదండ్రులకిట్లు చెప్పెను. "మీరు నాకొఱకేడ్వవలదు. పుట్టినవారెప్పటికైనఁ జావవలసినవారే. అందులో మునికాహారముగా

నన్నిచ్చుట మీకుఁ బుణ్యము. ఇంతకంటె గావలసిన భాగ్య మేమున్నది. ఇఁక మీరు దుఃఖింపక త్వరగా నన్ను జంపి మునికి వండిపెట్టుఁడు." ఈమాటలువిని సిరియాళుఁడు కొంత సేపు దుఃఖించి, తుదకు ధైర్యముబూని మతిమంతును వధించి యామాంసమును వండించి, పళ్లెములోఁ బెట్టి, మునిముందు బెట్టి భుజింపుమనిరి. ఆమునీశ్వరుఁడు రాజుంజూచి నీకింకను బుత్రులున్నారాయని యడిగెను. లేరని రాజుబదులుచెప్పెను. అట్లయినఁ బుత్రులులేనియింట భిక్షగొనసని రాజుతో కోప మునఁ బలికెను. రాజు ప్రతిమాలుకొనెను. అప్పుడు పరమేశ్వ రుఁడు దయగలవాఁడై "రాజా! నాకు! పుత్రులు లేనియింట భిక్షఁగొనసని ప్రతిసయున్నది. కావున పుత్రునిఁ గట్టిగాఁ బిలువుము. అతఁడు వచ్చును" అని చెప్పెను చచ్చినపుత్రుఁడు పిలిచినంతమాత్రముచేతను మఱల బ్రతికియెట్లువచ్చునాయని రాజు ఆశ్చర్యమంది మునిమాటనిని "మతిమంతా! మతిమంతా అనిగట్టిగాఁ బిలిచెను. వెంటనే మతిమంతుడువచ్చి సిరియా ళుని యెదుట నిలిచెను. ఇదియంతయు భగవంతునిమాయ. అంతట బరమేశ్వరుఁడు సిరియాళుని జూచి "రాజా ! నీధర్మ గుణము పరీక్షించుట కిట్టిపని చేసితిని. నీగుణమునకు మెచ్చితిని. ధర్మము నిలుపుకొనుటకుఁ గన్న కొడుకునుగూడ వధించితివి. వధింపబడిన నీకుమారుఁడు నాకరుణచేమరల బ్రతికినాఁడు. ఇఁక నీవు సుఖంబున నుండు" మని పలికి, పరమేశ్వరుఁడు

మాయమయ్యెను. సిరియాళుండును కుమారునిజూచి సంతో షించి భగవంతునిమాయ కాశ్చర్యమందెను.

దేవుని మహిమ లెవ్వరును కనుఁగొనఁ జాలరు. ధర్మ సంధులను బరీక్షించుట కనేకమాయలఁ బన్నును. కావునభగ వంతుఁడు పెట్టు కష్టములకోర్చి ధర్మము నిలుపుకొనినవాడు సుఖముల బొందును.

క. "దేవునిమహిమ లెఱుంగగ
నే విజ్ఞులునైన జాల ; రెంతని చెప్పం
గా వశమా భక్తావను
భావించిన దోస నడఁగుఁ ; బాపము పుత్రా!"

# 19. అపకారికైనను ఉపకారము సేయుము

పూర్వము దుర్యోధనుఁడను రాజు కలఁడు. ఈతఁడు కౌరవులలోఁ బెద్దవాఁడు. ఈతని పినతండ్రికొడుకులే పాండ వులు. ఈతనికి వారియందు చిన్నతనమునుండియు ద్వేషము కలదు. పాండవులకు రాజ్యములో భాగములేకుండఁ జేయవల యునని యాతడనేక మాయలను బన్నెను. తుదకాతఁడుపాం డవులనుమాయజూదములో నోడించి యడవులకుఁబంపించెను.

పాండవు లడవిలోనుండఁగా దుర్యోధనుఁడు తన గొప్ప తనము వారికిఁ జూపింప వలయునని పరిజనులతో నచ్చటికి

బోయెను. ఆసమయమున దుర్యోధనుని కొందఱు గంధర్వులు బట్టుకొనిరి. దుర్యోధనుని పక్షమునను్న వారు గంధర్వులను గెలువలేకపోయిరి. రాజును విడిపింపలేక పోతిమి గదా యని వారందరునువిచారింపసాగిరి. తుదకు దుర్యోధనుని భటులంద ఱును ఆసమీపముననున్న ధర్మరాజునొద్దకు బరుగెత్తుకొని పోయి "ఓధర్మరాజా! నీపినతండ్రి పుత్రుఁడైన దుర్యోధనుని గంధర్వులు బంధించుకొని పోవుచున్నారు. నీ వాతనిని రక్షింప వలయు" నని వేడుకొనిరి. ధర్మరాజు తమ్ముఁడైన భీముఁడు మొదలగువారు దుర్మార్గుఁడైన దుర్యోధనునకుఁ దగినపనియైన దని నవ్విరి. అప్పుడు ధర్మరాజు తమ్ములనుఁజూచి యిట్లు పలి కెను. "తమ్ములారా! మీరు నవ్వకూడదు. దుర్యోధనుఁడు మనకుఁ బినతండ్రికొడుకు. మనకపకారము చేసినవాఁడే యగు గాక. ఈసమయమున మనముదానిని దలఁపరాదు. విరోధి యైనను మనబంధు వొకరికిఁజిక్కినప్పుడు మనమూరుకొనరాదు. అపకారికైనను నుపకారమే సేయవలయును. కావున మీరి ప్పుడు తొందరగాబోయి గంధర్వులను బాఱదోలి దుర్యోధ నుని విడిపింపుఁడు." అన్నగారిమాటలువిని భీమాదులుబదులు చెప్పలేక తక్షణమేపోయి దుర్యోధనుని బంధించుకొనిపోవు చున్న గంధర్వులకడ్డుపడి గొప్పయుద్ధముచేసి వారిని గెలిచి దుర్యోధనుని విడిపించిరి. తనకు విరోధియని తలంపక దుర్యో ధనున కుపకారము జేసినందుకు ధర్మరాజును బ్రజలెల్లరు మెచ్చిరి.

"క. ఉపకారికి నుపకారము
విపరీతముకాదు సేయ ♦ వివరింపంగా
నపకారికి నుపకారము
నెపమెన్నక సేయువాఁడు ♦ నేర్పరి సుమతీ"

## 20 తప్పులెన్ను వానిని గొలువరాదు

పూర్వము విదిశాపురమును బాలించు రాజొకడుగలడు. అతఁడు మిక్కిలి కఠినమైన మనస్సుగలవాఁడు. దయ యను మాట నతఁడెఱుఁగడు. తన యొద్దనున్న మంత్రులయందును భటులయందును నెప్పుడు నేవో దోషముల నెన్నుచునే యుండును. రాజను మాటయేగాని యాతనింజూచిన నెవ్వరికిని నిష్టము లేక యుండెను. ఇట్లుండ వానియొద్దనొక విద్యావంతుఁ డుద్యోగము నిమిత్తమువచ్చెను. అతఁతడుమంచిగణికుడగుటచే రాజు వానికిఁ దనయాస్థానమున నుద్యోగమిచ్చెను. క్రొత్తలో రాజుగారి సంగతి వానికిఁ దెలియలేదు. కొన్నాళ్ళు జరిగిన తరువాత రాజుగారి చర్యలొక్కటొక్కటే యాతనికి దెలియ వచ్చెను. నిజముగా నాతఁడు సేయుచుండుపనిలో నేవిధమైన లోపములేదు. అయినను రాజుగారనుదినము వానియందేదో తప్పునెన్నుచు దూషించుచుండెను. ఎంతసంతృప్తిగాబనిచేయు చున్నను నాయాచారమును రాజు మానుటలేదు. ఇట్లనేకదిన ు గడిచెను. రాజుగారి వలన జీవాట్లులేని దినమొకటైన

నుండునాయని యాయుద్యోగి చూచెను. కాని యట్టిది కన బడలేదు. తుదకాతని ప్రాణము విసిగి "ఈరాజునకుదనయొద్ద నున్న వారియందుఁ గారణము లేకపోయినను దప్పువెదకుపని తప్ప మఱియొకటిలేదు. ఇట్టివానియొద్దనుండుట యెప్పటికైన హానియే." యని తలచి నెమ్మదిగా నారాజుయొద్ద కొలువు మాని మఱియొక పురమునకుఁబోయి మంచి యుద్యోగము సంపాదించుకొనెను.

"క. ఎప్పుడు తప్పులు వెదకెడు
నప్పురుషుని గొల్వఁగూడ ♦ దది యెట్లన్నన్
సర్పంబు పడగ నీడను
కప్ప వసించిన విధంబు ♦ గదరా సుమతీ."

# భగవన్నుతి.

మొదటి భాగము. రెండవ భాగము.

భగవన్నుతి యను నీచిన్ని పుస్తకము రెండుభాగములుగా వెలువడి యున్నది. ప్రతి భాగమునందును, నుత్తమ గ్రంథములనుండి గైకొనఁబడిన సంస్కృత శ్లోకములును, తెనుగు పద్యములును, షుమారు ౨౦౦ గలవు. శ్లోకములును పద్యములును, పండితులకే గాక, పామరులకుఁ గూడఁ జిర పరిచితములై యున్నవని చెప్పుట యెంతమాత్రము నతిశయోక్తి గానేరదు. ఇందుగల పద్యములన్నియు హృదయానందకరములే. అన్నియు భక్తిరసాత్మకములే. అన్నియుఁ బఠనీయములే. దీనియందుఁగల మాధుర్యమును జవిచూచిన వారు—భక్తిరసామృతంబును గ్రోలిన వారు—ఉత్కృష్టతను గనిపెట్టిన వారు, దీనివలనఁ గలుగు నిత్యానందము ననుభవించుటయేగాక, యెన్నటికిని మఱువఁజాలరనినొక్కి వక్కాణింపఁ గలము. వెల స్వల్పము.

ఒక్కొక్క భాగము ౨ అణాలు.

రెండుభాగములుకలిసి క్యాలికోబైండు 0-6-0

వలయువారు—

సీతారాం అండ్ కో, తెనాలి.